# కల్పవల్లి



గీతికాలతాంతాలు



శ్రీ వింజమూరి శివరామరావు



పబ్లిషర్సు:
వేంకట్రామ అండ్ కో.,
విజయవాడ - మద్రాసు - సికింద్రాబాదు

# కల్పవల్లి

గీతికా లతాంతాలు

శ్రీ వింజమూరి శివరామరావు

: ప్రకాశకులు :

వేంకట్రామ అండ్ కో.,

విజయవాడ - మద్రాసు - సికింద్రాబాదు



# అంకితం

తీయనైన గొంతునెత్తి
హాయిగ ఈ గీతావళి
వాడవాడ కడు మెచ్చగ
పాడిన వేదకుమారికి

శ్రీ తరుణీ హృదయేశ్వరు
డాతత సంపదలు పదవు లారోగ్యములున్
మోతే వేదకుమారికి
ప్రీతిగ సమకూర్చుగాక వేయిశరత్తుల్

# అంజలి

శారదరాత్రుల - యమునా
తీరవనుల - వల్లవీసతీ ఫుల్లమనః
కైరవముల - మోహన వం
శీరవముల - భక్తితో భజింతు సతమ్మున్.

మా తాతల్ కవితాసతీ గళగళ
న్మాధ్వీక మందాకినీ
స్నాతుల్ - రాఘవపాదపంకజ రజ
స్సౌరభ్య సంవాసిత
ఖ్యాతుల్ - పూర్వమహర్షి యోగబల
దివ్యత్ జ్ఞాన సౌభాగ్య సం
స్ఫీతుల్ - వారి నఖండభక్తిమతి
నర్చింతున్ తపశ్శీలురన్.

జనకులు మదీయ జీవితమ్మునకె కాదు
నా మనోవికాసమునకే నాకవిత్వ
తత్వమునకె నాతల్లియు తండ్రి - వారె
గురులు దైవమ్ములు భజింతు పరమభక్తి.

---

# కృతజ్ఞత

ఈ కల్పవల్లి ముద్రణకూ, ప్రచురణకూ ఆదరణపూర్వకంగా విశాల హృదయంతో సహకరించిన శ్రీ ఈదర వేంకటరామయ్యగారికి నా కృతజ్ఞతాభివందనాలు.

అతిస్వల్పకాలంలో ముద్రించిన వేంకట్రామ్ పవర్ ప్రెస్ వారికీ-ప్రచురించిన వేంకట్రామ అండ్ కంపెనీ వారికి నా అభినందనాలు.

గేయరచనలో నాకు గురుదేవుడు - నా మేనమామ - దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రిగారు. ఆ మహాకవికి ప్రణామాలు. ఆదరించి, అభిమానించి, నన్నూ నా గీతావళినీ ఆశీఃపూర్వకంగా పరిచయం చేస్తూన్న కవిపండితాగ్రణులు - శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారికి నమస్కారాలు.

ఈ పాటలకు వరుసలు పెట్టి, పాడి, పాడించిన -

శ్రీమతి ఎస్. కె. కన్నమ్మాళ్ కీ,

శ్రీ మునునూరి వేంకట రమణమూర్తికీ,

శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుకీ,

శ్రీ మంగళంపల్లి బాలమురళీ కృష్ణకి

ముఖ్యంగానూ, నా కృతజ్ఞతాభివందనాలు.

ఈ గీతావళిని ప్రచురించడానికి అనుమతించిన ఆకాశవాణి నిర్వాహకులకు సర్వదా కృతజ్ఞుణ్ణి.

—వింజమూరి శివరామరావు.

# తొలి పలుకు

'నా గేయసంపుటిని ప్రకటించు భారము తాను పూనెదనని శ్రీమతి వేదకుమారి వాగ్దానము చేసినదిసుమండీ' అని హర్షవికసితమైన చూడ్కితో నన్ను చేరవచ్చి శ్రీ వింజమూరి శివరామరావు వక్కాణించినప్పుడు-అగుచో నీ వా కృతిని ఆమెకే అంకితమిమ్ము అని హెచ్చరించితిని. ఆప్పటికా మాట నానోట అప్రయత్నముగా వెలువడినదే! కాని, పర్యాలోచనమీద అది సహేతుకమనియు, సముచితమనియు నిర్ధారితమైనది. వీనుల-సుధామధురము లైనవి. శివరామరావు గేయఖండములు; ఆకాశవాణిలో సశరీరసంగీతవాణియై విఖ్యాతినార్జించిన గానకళాధురీణ శ్రీమతి వేదకుమారి. ఆపాట లామెకు కాక మరెవ్వరి కర్పింపబడినను ఇంతయౌచిత్యము లేదు.

శ్రీ శివరామరావు ఈ యౌచిత్యమును వెంటనే గ్రహించెను కాబోలు! నా సలహాను ప్రీతిపూర్వకముగా నంగీకరించెను. అప్పుడు మా చెంతనేయున్న శ్రీమతి వేదకుమారిమాత్రం వినయ లజ్జా వినమ్రమైన మోముతో - కృతిస్వీకారము నేను మోయలేనిభారము - అర్హతలేని గౌరవము - దానిని తలపెట్టవద్దని మందమందముగా, మధురమధురముగా త్రోసిపుచ్చజూచెను. కాని, మేము నొక్కిచెప్పినందున, అంగుల కంగీకరించెను. ఆ క్షణిక సన్నివేశములో శ్రీ శివరామరావు మనోరథము, శ్రీమతి వేదకుమారి వాగ్దానము, నా సంకల్పము సఫలముకాగల ముహూర్తబల మున్నది కాబోలు! ఆ మూడు భావములు నేటికి మూర్తిమంతములైనవి.

ఆ నాటి మనోభావములు ఈ నాటి కిట్టి శుభపరిణామము చెందినందుకు ఈ మిత్రులిరువురను అభినందించుచు, ఆశీర్వదించుచు, నన్ను నేను కొనియాడుకొనుచున్నాను. జగద్విఖ్యాతములైన ఈ గేయములనుగురించి నేనుగాని, మరెవ్వరునుగాని క్రొత్తగా చెప్పవలసినదిలేదు. ఇవి పాడుకొనుటకును, చదువుకొనుటకునుగూడ ఇంపుగా సొంపుగా తీర్చిదిద్దిన రసగుళికలు.

—శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు

---

# భక్తిగీతాలు

శ్రీరమణీ రమణా ! మురారీ !
శౌరి ! దైత్యసంహారి ! హరీ !! శ్రీ.

సారసనయనా ! దేవ ! ముకుందా !
వారిధిశయనా ! గోవిందా !! శ్రీ.

నీలనీరదాకార ! మాధవా !
పాలితలోక సమస్త ! కేశవా !
అపవర్గశిరః కిరీట నవర
తారాంశురంజితోజ్జ్వలపాదా !! శ్రీ.

వరవైకుంఠ నివాసమందిరా !
సురయోగీశ్వర మనోవిహారా !
దుష్టశిక్షణాయత్త మానసా !
శిష్టరక్షణారంభ భావనా !! శ్రీ.

*

నటరాజా ! శివ ! సాంధ్యనటా !
నమోనమో భవ ! గాంగజటా !! నట.

ప్రణవాంచిత మందిరవర్తీ !
ప్రణయాశ్రిత సుందరమూర్తీ !! నట.

భేదములన్నియు వీడుమనీ -
ఖేదము లిక రా గూడదనీ
త్యాగములూ అనురాగములూ వహి
యించుమంచు బోధించినావయా. ఓ.

నిత్యమైన సత్కర్మపథమ్మున
సత్యమె తోడుగ ధర్మరథమ్మున
సాగెనోయి నీ జీవితమూ!
యోగివి నీ కభివందనమూ. ఓ.

*

ఏల మీరిటు లాడెదరు ? నా
బాలకునిపై నిందలా ? ఏల.

అన్నమును పున్నము నెరుంగని
పిన్నవా డత డెంచరో ! ఏ ల.

ఎప్పుడూ మాయింట నాడుచు
ఎన్నడూ పొరుగిండ్ల కేగడు -
ఎవ్వరితో పోట్లాడ నేరడు
రవ్వచేయుట న్యాయమా ? ఏల.

లేవొ మీగడ పాలు పెరుగూ ?
లేవొ వెన్నలు మా గృహమ్మున ?
ఊరకే యిటు చెప్పనేటికి
నేరములు నా పాపపై ? ఏల.

చూడగా పసివాడుగా ! మగ
పోడుములు కావించు నంటిరి !
ఇంతకంటె విచిత్రముండునె ?
ఎందు కిట్టుల రట్టులూ ? ఏల.

*

శ్రీ రఘునందన ! దాశరథీ !
వైరి విదారణ కారణ శరధీ !! శ్రీ.

రామ – జానకీనాథ – మాధవా !
ప్రేమ సుధార్ణవ పూర్ణమానసా !! శ్రీ.

రాతి నాతిగా జేసిన పాదము
భూతలము పవిత్రము చేసినదీ –
పాదుకలకు రాజ్య మొసంగిన నీ
పాదయుగము సంపూజ్య మైనదీ శ్రీ.

సర్వమానవా దర్శమూర్తివై –
ఉర్వి రామ రాజ్యాధినేతవై –
సన్నుతిగన్న మహామహితాత్ముడ
వెన్నగ నవతారము నీ జన్మము శ్రీ

*

ఓ కన్న తండ్రి – రావోయి – రావోయీ !
చీకట్లు పోగొట్టు వెల్గు తేవోయీ !! ఓ.

నీల మేఘాల అందాల మై చాయతో –
వర శరత్తుల గాయు చిరునవ్వు హాయితో ఓ.

లోకమ్ములో సౌఖ్యమే కానరాదోయి !
భీకరమ్మైనతోచె బృందావనమ్ము ఓ.

గోపబాలకులతో గోపికాంగనలతో
వ్రేపల్లె నీకోసమే వేచియుండె ఓ.

*

బోసినవ్వుల బాపుజీ ! కరు
ణాసముద్రుడు గాంధిజీ !! బోసి.

పోరుబందరులో ఫలించిన
పుత్తలీసతి పుణ్యమూ బోసి.

భారతీయుల భాగ్యవరమై
ధారుణికి సౌభాగ్యకరమై
ఆ మహాత్ముని జన్మ ధన్యము
ఈ మహీతల మందునా బోసి.

ఉప్పుగొని సామ్రాజ్యశక్తుల
నుప్పుమని పైకెగుర గొట్టుచు
నిత్యమగు స్వేచ్ఛాపథమ్మున
సత్యమగు నాగ్రహముతో జనె బోసి.

ద్వేషములు రోషములు త్రుంచెను
రాగములు త్యాగములు పెంచెను
దేశభక్తియు దైవభక్తియు
ఆశలకు సందేశ మిచ్చెను బోసి.

ధర్మరథ సారథిగ పూజ్యుడు
కర్మచంద్రుని పుత్రుడూ
కస్తురీసతి ప్రాణనాథుడు
నిస్తులాశయ నుతచరిత్రుడు బోసి.

*

అమరజీవితము కోమలసుమాసవమై
అమృతవాహినియయ్యె పరమపావనమై అమర.

పరుల బాధల కాత్మ సెలయేరుగా కరగ
దురితాలకు మనమ్ము సుడిగుండమై సురిగె అమర.

నిదురించులోకాల కది మేలుకొలుపయ్యె
తుదిలేని కాలాలలో తేలు వలపయ్యె అమర.

సత్యమ్మహింసకై తపియించినాడంట
నిత్య సౌహార్దమ్ము వరమిచ్చినాడంట . అమర.

*

భారత జనతా వర నేతా !
భావి యుగాల జగాల విధాతా !! భారత.

కాలానికి చైతన్యాదేశం -
లోకాన అహింసా సందేశం -
జీవనమే అది మహాజ్యోతియై
పావనమైనది - శాంతిదూతవో భారత.

ఒక సత్యానికి - ఒక ధర్మానికి -
సకల మానవుల అభ్యుదయానికి -
పైగంబరువలె జీసస్‌వలె మా
యోగీంద్రులవలె త్యాగమూర్తివో భారత.

నీగతియే చలియించని దైనది -
నీ గళమే నశియించని దైనది -
నీ ప్రశాంతిలో దివ్యకాంతిలో
ఈ ప్రపంచమే సుందర మగునో భారత.

*

గౌతమా ! మహానుభావ !! నీ తపస్సు దివ్యమూ -
ఈ మహా మహీతలాన నీ మహస్సు భవ్యమూ గౌతమా.

కామమునూ క్రోధమునూ మోహమునూ లోభమునూ
మదమును మాత్సర్యమునూ అదిలించి విదిర్చినావు గౌతమా.

నీ నయనాంచల మందున ఏ శరత్తుపండునో !
నీ హృదయాంతర మందున ఏ సుధాబ్ధినిండునో !! గౌతమా.

మూలము ధర్మమ్మునకూ - మూలము సంఘమ్మునకూ-
మూలము బుద్ధమ్మునకూ - నీవె శరణ మో ప్రభూ ! గౌ.

*

పావనుడు భగవానుడట - లో
కావనుండట - చూడరే ! పావ.

అవని దుఃఖము లంతరించుట
కవతరించె తథాగతుండట !! పావ.

సరసిలో అరుణాంబుజమ్ములు
విరిసినవి సౌరభము చల్లుచు -
రాజవీథుల సితగజమ్ములు
తేజమున విహరించు నవిగో పావ.

ఆకసముపై నీలమేఘము
లాడుచుండె మనోహరములై -
ఉదయగిరిపై తోచు సూర్యున
కెదురుగా వికసించె సత్కృప పావ.

*

జగదుద్ధారక కారకమూ !
భగవద్గీత మహత్తరమూ !! జగ.

పావనము కురుక్షేత్రములో భగ
వానుడే ప్రసాదించిన వరమూ జగ.

చీకటి పేరుకునే సమయమ్మున
వేకువ తూరుపునం దుదయించదో !
ధర్మము కడుక్షీణించిన వేళల
దైవ మవతరించుననీ చాటెను జగ.

ధర్మమార్గదర్శక ముత్తమమూ !
కర్మయోగ దేశిక మున్నతమూ !
సర్వకాల విభాజితమూ !
సర్వలోక సంపూజితమూ !! జగ.

*

వాసుదేవ గోపీ మనోహరా !
రాసకేళికాలోల హరీ !! వాసు.

ఈవల గోపిక ఆవల గోపిక –
నీ ఇరువంకల పెక్కురూపుల
యమునాతీర వనాంతర సీమల
సుమనో వీథుల విహారింపుమయా వాసు.

వేణువునూ, వనితాహృదయమ్ముల
వీణలనూ పలికించు గాయకా !
వెన్నెలలో, వ్రజకన్యల కాటుక
కన్నులలో పులకించు నాయకా !! వాసు.

*

శ్రీ తులసీ ! అభివందనమూ !
పాతక హారిణి ! శుభవందనమూ !! శ్రీ.

మా గృహములలో ప్రాంగణసీమల
మంగళదేవతవై విహరింపుము శ్రీ.

ఆది లక్ష్మి దివ్యాంశమునందున
ఈ ధరిత్రి జన్మించితివీ !
ఆది విష్ణు పాదార్చనకొరకై
బాధలకోర్చి తపించితివీ !! శ్రీ.

ఈ జగమంతట కల్పవల్లివై
రాజిలుచుందువు కన్నతల్లివై –
నిను పూజింతుము పరిపాలింపుము !
వనితాళికి సౌభాగ్యము నింపుము !! శ్రీ.

*

ఎవరమ్మా - ఎవ రెవరమ్మా !
మాటల మూటవు - పాటల పేటివి ఎవ.

ఆది ఋషులు వాల్మీకి వ్యాసుడూ
కాళిదాసు నన్నయ్యా తిక్కనా
నీ చరణమ్ముల ప్రాంగణ సీమల
కావ్య శరత్తుల హారతి పట్టిరి ఎవ.

త్యాగరాజు మీరాసతి కంబరు
తులసీదాసు పురందర దాసులు
నీ పద వర సంకీర్తనమ్ముతో
గేయ సుమమ్ముల పూజలు సల్పిరి ఎవ.

నీ చిరునవ్వది వెన్నెల మడుగై -
నీ యలుకే యొక చిచ్చర పిడుగై -
పరువమ్ములతో గరువమ్ములతో
నాలుగు దెసలా నేలుగదా ! ఎవ.

*

ఓ సమున్నత కవితా ! కవితా !
భావోన్నత నూతన కవితా !! ఓ.

యువమానస మందిర కవితా !
నవజీవన సుందర కవితా !!
రసమూర్తులు కవిశేఖరులూ
కుసుమాంజలి సమకూరిచిరీ ఓ.

మందాకిని తట వాటికలో
నటియించే చైతన్యముతో -
గోదావరి తీరావనిలో
నదియించే సౌందర్యముతో ఓ.

భరతావని పూవుల తోటల
ప్రసవించిన చక్కని అలరై -
భరతాశయ మందిన బాటల
ప్రసరించిన చల్లని వలపై ఓ.

నీ పాదము చలియించనిదై -
నీ నాదము నశియించనిదై -
నీ గతు లీ జగాల సాగూ -
నీబుతు లే యుగాల మ్రోగూ ఓ.

*

కాత్యాయనీ ! కన్నతల్లీ ! మమ్మేలు
భక్తావనీ కల్పవల్లీ !! కాత్యా.

నీ సేవలే నిత్య సంకీర్తనమ్ములే
మా జీవితాల భాగ్యాలు సౌభాగ్యాలు. కాత్యా.

శివదేవ సీమంతినీ ! జేజేలు
భువనైక సామంతినీ !!
నీచూపు వెల్గులో నీ నవ్వు వెన్నెలో
ఏకాలమూ మూడులోకాలపై నాడు కాత్యా.

ఇంద్రకీలాధ్యాసినీ ! దుర్గమ్మ -
సాంద్ర తేజోద్భాసినీ !!
నిన్ను పూజింతు మీ హృదయాల కుసుమాల -
మన్నింపుమమ్మ నీ చరణాలె శరణాలు కాత్యా.

*

శ్రీరామలింగేశ్వరా ! రక్షింపు
మోరాజ రాజేశ్వరా !!

పార్వతీ ప్రాణేశ్వరా ! మాంపాహి
సర్వదేవాధీశ్వరా !!

సురవాహినీకృజ్జటా ! వందనం
పరమేశ సంధ్యానటా !!

పన్నగేశాలంకృతా ! రక్షింపు
సన్నుతాఖిలదేవతా !!

ఓంకారనాదప్రియా ! మాంపాహి
శంకరా భక్తాశ్రయా !!

కైలాసవాసా హరా ! వందనం
బాలేందు భాస్వచ్ఛిరా !!

*

మంగళం వైకుంఠమందిరునకూ !
మంగళం లోకైక సుందరునకూ !! మంగళం.

శ్రీదివ్యచిత్తాబ్జ భాస్కరునకూ !
వేదాంత మస్తకోద్భాసురునకూ !! మంగళం.

దుష్టదానవగర్వ భంజనునకూ !
శిష్టమానవ సర్వరంజనునకూ !! మంగళం.

వరదునకు విశ్వపతి కీశ్వరునకూ !
వరదయాంభోనిధికి శాశ్వతునకూ !! మంగళం.

*

# జాతీయ గీతాలు

శ్రీ పురాణ ధాత్రికీ! మాపవిత్ర నేత్రికీ!
భారతీయమాత కిదే వందనం! వందనం!! శ్రీ

గురులకు నాగార్జున శంకరులకు మావందనం!
భక్తులకూ సర్వకళాసక్తులకూ వందనం!! శ్రీ

పూజనీయులైన త్యాగరాజులు వాల్మీకులకూ–
దేశసేవకుల కుత్తమ దేశికులకు వందనం! శ్రీ

రామనామ జపశీలికి – ఆ మహాతపశ్శాలికి–
సబర్మతీయతీంద్రునకు – జాతిపితకు వందనం! శ్రీ

కర్మవీరులకు ఉజ్జ్వల ధర్మములకు వందనం!
యుగయుగాల అభ్యుదయ ప్రగతికి మావందనం! శ్రీ

*

భారతమాతకు జయసంచయమూ!
భారతజాతికి దిగ్జయమూ భారత.

ఆర్యజనుల దివ్యాత్మబలముతో –
శౌర్యధనుల సద్బాహుబలముతో –
ప్రతిభావంతుల మనోబలముతో –
అతిలోక శుభోన్నతు లందుకునే భారత.

యువగాయక సత్కవి వైతాళికి
నవ కంఠారవ నుతచారిత్రకు –
చిత్రకళావృత శిల్పసుందరీ
నృత్యవిలాస వికాస విధాత్రికి, భారత.

ప్రజలందరు సోదరులై యెప్పుడు
నిజధర్మ పరాయణులై యొప్పగ –
సుందరముగ సుశ్యామలముగ ఆ
నంద మందిరమ్ముగ వికసించే, భారత.

*

అదిగో మనజెండా !
అల్లదిగో మనజెండా !! అదిగో

నడిమిన్నుల వెన్నెలనిండా –
మెడలోనికి చుక్కలదండా. అదిగో.

అనురాగములూ త్యాగములూ
జనించు ఘనసందేశము లిచ్చుచు
పరపీడనలూ వేదనలూ
హరించు మహదాశయమ్ము లొప్పుచు. అదిగో.

పైకి పైకి పైపైకి సాగుచూ –
చీకటినింగుచు మూడువన్నెలూ –
ఏకకాంతియై – ధర్మచక్రమే
లోకశాంతికై వికసించినదీ. అదిగో.

శ్రీరఘురాములు ధర్మరాజులూ
ధీరు లశోకులు విక్రమార్కులూ
శాలివాహనోదారులు వీరులు
పాలన చేయగ పూతమైనదీ. అదిగో.

*

శాంతిరథం కదిలెనోయ్ కాంతిపథంలో !
కాంతిరథం నిలిచెనోయ్ శాంతిపథంలో. శాంతి.

దారిపొడుగునా పచ్చని తోరణాలు కట్టినారు –
త్రోవలన్నిటా ముగ్గులు పూవులతో పెట్టినారు శాంతి.

కోటి కోటి గొంతు లొక్కమాటగ పలికించునంట –
కోటి కోటి గుండె లొకేపాటకు పులకించునంట. శాంతి.

కరువులేక జీవితముల బరువురాక హృదయమ్ముల –
తీయని స్వప్నాలతోడ హాయిగ జీవింతుమింక. శాంతి.

మహాత్ముడే సారథియై అహింసైక శక్తితోడ
నడిపింపగ సాగివచ్చె కడలన్నిట వెల్లువిచ్చె. శాంతి.

*

ఓ హరిజనులారా వినుడీ !
శ్రీహరి కృపచే మీరు కృతార్థులు. ఓ

భారత జనతా నేత బాపుజీ
కోరిక నేటికి తీరెనయా. ఓ

మాధవ పద పూజా సుమహారాలల
మాలలంచు పోనాడుదురా యని
లోకహితుడు గాంధీమహాత్ముడే
మీ కొరకై తపియించి నాడయా. ఓ

కులభేదములూ మతభేదములూ
తలపోయుట అన్యాయమనీ -
చూసి చూసి మీ దురవస్థలు తా
చేసినాడయా ఉపవాసమ్ములు. ఓ

నరనారీ సముదాయమంతయూ
పరమేశ్వరు సంతాన మనీ -
గుడిలో గంటలు మ్రోగుచుండె సం
దడిగా - వడిగా పదగండి. ఓ

*

మనదేశమ్మున కొత్త జెండా !
మన శక్తులు దిక్కుల నిండా !! మన

మన నేతల శీలమె ఆశయమే
మన దారిని వెన్నెల పండింపగ. మన

పరిశ్రమించిన కుటీరములలో
సిరి సంపదలూ దక్కునుగా !
కర్షకులకునూ కార్మికులకునూ
హర్షము చేకురు నిక్కముగా !! మన

ఇల పోరాటము లెందుకనీ – ఇక
వల దారాటము లెవ్వరికీ నని –
భారత నవరాజ్యాంగము తిరమై –
దారిజూపు నీ ధాత్రికి వరమై. మన

*

జయగంట మింట మ్రోగినదీ !
జయమంచు మించి సాగినదీ !! జయ

భారతీయ స్వాతంత్ర్య దివ్య శం
ఖారవమ్ముతో శ్రుతిగా జతగా. జయ

వడిగా నిశాంతములు తెచ్చీ – సం
దడిగా దిశాంతముల జొచ్చీ –
పోరాటములూ ఆరాటములూ
ఎందుకనీ – ముద మందుమనీ. జయ

నరులందరూ సహోదరు లనుచూ –
పరు లెవ్వ రిందు లేరనుచూ –
మానవజాతికి శాంతి అహింసలె
మానితధర్మము లని చాటింపుచు. జయ

అదె మూడువన్నెలా జెండాయని –
అదె చూడు వెన్నెలా పండే దని –
సత్యమునకు సంకేతమనీ – అది
నిత్యమైన కేతనమ్మనీ. జయ

*

ఏనాడో భోగాల తేలిందిలే! తల్లి
ఈ నాల్గు దిక్కులూ యేలిందిలే!! ఏనాడో.

చేలన్ని బంగారుపంటతో పొంగార -
నేలయంతా పండువెన్నెలై నిండార -
ఏనాడో భాగ్యాలు కురిసిందిలే! తల్లి
ఈ నాల్గు దిక్కులా విరిసిందిలే!! ఏనాడో.

చిరునవ్వు నవ్వేనా వరములనిపించేది -
ఎరుపు చూపొరసెనా ధరణి వణకించేది -
ఏనాడో గర్వాన తిరిగిందిలే! తల్లి
యీ నాల్గు దిక్కులా పెరిగిందిలే!! ఏనాడో.

తనమాట తనపాట - తనశక్తి తనయుక్తి -
ఇరుగు పొరుగమ్మలకు ఎరువుగా నిచ్చింది -
ఏనాడో సౌందర్య మేచిందిలే! తల్లి
యీ నాల్గు దిక్కులా శోభించిందిలే!! ఏనాడో.

కొన్నాళ్లు నిద్రలో కన్నుమూసిందంటు -
తెలుగమ్మ యీనాడు వెలుగు [illegible] -
ఏనాడో భోగాల తేలిందిలే! తల్లి
యీ నాల్గు దిక్కులూ [illegible]!! ఏనాడో.

*

ఉదయమాయె – శుభోదయం !
ఆంధ్రదేశ మహోదయం !! ఉదయ.

మేలుకొన్నవి మూడుకోట్ల జ
నాళి హృదయాంభోరుహమ్ములు –
పొంగినవి గౌతమీ కృష్ణలు
తుంగభద్రలు సంతసమ్మున ఉదయ.

ఒక్కటే తెలుగైన మాటలు –
చక్కగా జిలుగైన పాటలు –
ఆడుకొనుచూ పాడుకొనుచూ
కూడి ముందుకు సాగు డందరు ఉదయ.

పాడిపంటలు పెరుగునట – మా
వాడలో కరు వెరుగబోమట –
ధనము ధాన్యము హెచ్చుచుండగ
జనము శాంతి సుఖాలు పొందగ ఉదయ.

*

తెలుగుతోటలోన పూల వెలుగుబాటలోయ్ !
వెలుగుబాటనుంచి మంచి పలుగు పాటలోయ్ !! ॥ తెలుగు॥

నవ్వుకొనే పువ్వులోయ్ ! నవ్వజేయు పువ్వులోయ్ !
వన్నెలు చిన్నెలు చూపుచు మిన్నుల వెన్నెల నూపుచు ॥ తె॥

అలు తుమ్మెద మ్రోతలోయ్ ! ఇటు కోయిల కూతలోయ్ !
బాధలన్ని మరపించే గాధలెవో మురిపించుచూ ॥ తెలుగు॥

ఇరుకులేని తోట యిదే కనరండీ ముదమందా !
కరకుగాని పాట యిదే వినరండీ పదిమందీ !! ॥ తెలుగు॥

*

వందన మాంధ్ర మహాజననీ !
సుందరతర పౌరాణికావనీ !! వందన.

నవజీవన దాత్రీ ! ప్రియజననీ !
యువభారత పుత్రీ ! జయ ధరణీ !! వందన.

వరగోదావరి కృష్ణ పినాకిని
ఝరీసహస్రము తుంగభద్రలూ
నటియించిన చైతన్యము నీయది –
నదియించిన యుజ్జీవము నీదియె. వందన.

నన్నయ తిక్కన త్యాగరాజు గో
పన్నయు క్షేత్రయ నీ ప్రియపుత్రులు–
రాజరాజులూ రుద్రమాంబలూ
రాయలు నీ పదసేవకు పాత్రులు. వందన.

పురాతనమ్మగు సంప్రదాయమూ
పురోగమించిన సంస్కృతియూ –
వరమై గౌరవకరమై తిరమై
చిరకాలము లోకము పాలింపుము. వందన.

*

మేలుకొనవె - తెల్లవారె - మేలుకొనవె చెల్లెలా !
ఇరులు పీడకలలూ నిద్దురలు జారె చెల్లెలా !! మేలు.

తూరుపుమల నెత్తమ్ముల తేరిన బంగారుకాంతి
అంధకార బంధురముల బంధమ్ముల తొలగజేయు. మేలు.

తూరుపుదెసలో సంద్రము మారు మ్రోగు నవగళమ్ము
నూతన కళ్యాణ భావ గీతావళి పలుకజేయు. మేలు.

తూరుపు తోటల పూవుల దారుల మందానిలమ్ము
చిరతర సుందర జీవన పరిమళము కలుగజేయు. మేలు.

నవకాంతి వికాసములో యువకంఠారావములో
స్వేచ్ఛానిల వీచికలో జీవించే హృదయముతో. మేలు.

*

నడవండోయ్ ! నడవండోయ్ !
గుడిలో వెల్తురు కనరండోయ్ !! నడ.

తడబాటెందుకు అడుగొక్కటిగా
వడిగా ముందుకు సాగండీ ! నడ.

కోనలు కొండలు యెడారులూ
కానలు వాగులు దాటండీ ! నడ.

శాంతముతో - అహింసతో -
కాంతి పథమ్మున దూకండీ ! నడ.

మానవులందరు సోదరులై
మా నవభారత మాత పూజకై. నడ.

*

అదిగదిగో రాజఘట్ట – మదిగో మానవుకోవెల
పదవోయ్ పద యాత్రికుడా ! పదపదవయ్యా !! అది.

మలుపులేని దారియిదే – తలుపులేని ద్వారమదే –
కోవెలలో క్రొత్తవేల్పు కొలువై మానవుడూ. అది.

లేదు హెచ్చుతగ్గు అందు రాదు అంటరానితనం –
ఎల్లరపై లేవెన్నెల జల్లు వింత కోవెలా. అది.

కనులమ్రోల నొకే కాంతి – మనసులోన ఒకే శాంతి –
మనుగడ మధుభాండమైన మానవుడే దేవుడూ. అది.

*

భావికాల మహోదయములో
భారతము వీక్షింపరా ! భావి.

రామరాజ్యము విస్తరింపగ
సౌమనసభావమ్ము నింపగ. భావి.

ఎడదపై విరిదండ జాహ్నవి –
నడుముపై మొలనూలు గౌతమి –
అడుగులకు కావేరి కృష్ణయు
కడియములుగా మెరయగా. భావి.

హిమాచల సానువులు సేతువు
సముద్రములూ నదులు వనులూ
భారతీయుల భాగ్యములు సౌ
భాగ్యములు పెంపొందజేయగ. భావి.

భేదములు యుద్ధములు హింసలు
ఖేదములు మాయించు స్వర్గము
లోకమున దీపించగా - నర
లోకమే సురపాళిగా. భావి.

*

పండు వెన్నెలా - అదే - కొత్త వెన్నెలా !
నిండుకొన్నదీ - నాల్గుదిక్కులందునా. పండు.

మూడుపదుల కోట్లనరులు నేడుచూడ నిజం సురలు -
భారతమ్ము స్వర్గముగా మారె నెంతో వింతగా. పండు.

బిగిసికొన్న సంకెళ్ళవి తెగిపోయినవీ -
పేరుకొన్న చీకట్లవి దూరములకు చెదరినవీ. పండు.

పాడైనవియిండ్లు నేడు సుందరతర మందిరాలు -
బ్రోడైన వనాలుచూడ అందమైన నందనాలు. పండు.

నిరాశలూ దురాశలూ లేవిక మా జీవితాల -
నిరంతరం శాంతి సౌఖ్య సాధన మా ఆశయం. పండు.

*

పదండయ్యా ! పదండయ్యా !
పదండి – పదండి – పల్లెలకూ !! పదం.

భారతమాతకు సత్తపః ఫలం –
భారతజాతికి అభ్యుదయకరం –
అరయంగా మన గ్రామములే
ధరలో నమరా రామములూ ! పదం.

కరువుండదు గ్రామాల పెంపులో –
నరులందర కేపారు నింపులూ –
పాడియు పంటయు హాయి హెచ్చగా
చూడు మోయి నీ పైరు పచ్చనా ! పదం.

చల్లని గాలియు చక్కని వెలుగూ
కొల్లలుగా మన పల్లెల గలుగూ –
మంచి తలపులూ మంచినడకలూ
మించి బ్రతుకులం దాడుచుండగా – పదం.

*

హారతి జయహారతీ ! భారతీయ జనయిత్రీ !! హారతి.

వినుతాశయ పరిపూరిత జనతా మానసనేత్రీ !
పరమతత్వ తేజోవృత కరుణాంచిత సుమగాత్రీ !! హారతి.

కాంతిపథ విహారిణీ ! శాంతి ధర్మ ధారిణీ !
సర్వకాల వర సస్యశ్యామల సుందర ధాత్రీ !! హారతి.

*

# ప్రకృతి గీతాలు

ఓ గౌతమీ! స్రవంతీమతల్లీ!
గోదావరీ! నమస్కారమ్ము తల్లీ !! ఓ.

నీ జీవనమ్ము మా జీవనాధారమ్ము -
నీ తీరదేశమ్ము ధాన్యభాండారమ్ము ఓ.

ఆరామములు నాలు గాలయమ్ములు వేలు
నీ పావనత్వమ్ము నిత్యమ్ము చాటించు -
చిత్రాలు శిల్పాలు నాట్య సంగీతాలు
నీ కళాసక్తి నత్యంతమ్ము పాటించు ఓ.

సౌందర్య గాంభీర్య శాంత స్వరూపిణీ !
భారతీయోదార భావ ప్రదర్శనీ !
తొలిసారి నీకెరటములపైన తలయెత్తె
తెలుగు తీయనికైత - జిలుగు వెన్నెలపూత ఓ.

భద్రాద్రిలో రామభద్రు సంసేవించి -
కోటిలింగాల నీ నీట నభిషేకించి -
పరిపూతవై - సర్వజగతి విఖ్యాతవై -
పరిపాలనము చేయు మమ్ము ! మమ్మేవేళ ఓ.

*

ఇటురావే చెలి ! ఇటురావే !
అటు చూడవె ఆమని డాసినదే ఇటు.

మిన్నుల వెన్నెల కాసినదే – చెలి !
కన్నులపండువు చేసినదే !
సోకిన వేకువ కొమ్మలపై చివు
రాకున వన్నెలు వేసినదే !! ఇటు.

పూవులతీవలు పూసినవే – చెలి !
తావులు హాయిగ దూసినవే !
కానలు కోనలు తీయతీయగా
తేనెల సోనలు పోసినవే !! ఇటు.

జుమ్మని తుమ్మెద మ్రోసినదే – చెలి !
కమ్మని తెమ్మెర త్రోసినదే !
మనలో కోరిక లీరిక లెత్తగ
వినవే కోయిల కూసినదే !! ఇటు.

*

ఆకాశవాణీ ! విశాలాంధ్రవాణీ !
సంగీత సాహిత్య సత్కళాశ్రేణీ !! ఆకాశ.

తొలిప్రొద్దు జాడలో మలుసంజ నీడలో
వెలుగుతో ఒకక్రొత్త మెలుగుతో వినిపించు ఆ.

వాయుదివ్యపథాల స్వాదునవ్యవిధాల
నీగళ మ్మేవేళ మ్రోగు సందేశాలు ఆకాశ.

కరగించు నీపాట మా హృదంతరములా-
కదలించు నీమాట మా జీవితములా ఆకాశ.

*

ఓ మేఘరాజా ! ఒహో మేఘరాజా !!
స్వామి నీసందర్శనం బెన్నడో ? ఓ.

రావా వర్షానాథ ! శంపా సనాథా !!
జీవితా లెండి ఆక్రోశించుచుండే ఓ.

పొలము లెండలకు బీటలువారినవి చూడు –
మవిగో తోటలు వాడినవి గాడ్పులకు మాడి
నీలాల నీరూపుచూప సిగ్గైనదా ?
జాలిగుండే నీది – జాలమేలా ? ఓ.

ఈ దారు లీయేరు లీపైరు లన్నియూ !
నీ దయాదృష్టికై వేచియున్నాయీ !
ఈ వాడ లావాడ లే యెల్లజాడలూ
నీ వానజల్లుకై చూచుచున్నాయీ !! ఓ.

*

వందనం ! అభివందనం !
అందుకొను మా కృష్ణవేణీ !! వందనం.

సాగరేశ్వర మనో హారిణి !
ఆగమోన్నత పథ విహారిణి !
గౌతమీ ప్రియ సోదరీ ! నవ
జాతిరత్న మయోదరీ !! వందనం.

పావనీ ! సకలాంధ్ర జన సం
సేవితోత్తమ వాహినీ !
కనకదుర్గ కటాక్ష కరుణా
ఘన రసాంచిత జీవనీ !! వందనం.

వర దయాంచిత ధర్మములు – సుం
దరములైనవి శిల్పములు – నీ
తీరములలో పెంపునొందె – ను
దార భావము లావరింపగ. వందనం.

*

తేలికగా మరి తేలికగా –
బాలికనూ గొనిపోవుద మోయ్ ! తేలి

మెల్లగ మెల్లగ మూపులపై
పల్లకి పెళ్లికి మోయుదమోయ్ !! తేలి

మా మృదుగాన మరుద్గరుత్తుపై
కోమల సుమమై తూగులాడగా -
మధురస్వప్న సుధాధర వికస
న్మధుహాసముగా తూలియాడగా. తేలి

హాయిగ హాయిగ పోవుదమోయ్ !
ఆడుచు పాడుచు మోయుద మోయ్ !!
తారహారమం దాణిముత్యమై
ఆ రమణీమణి యొప్పుచుండగా. తేలి

( సరోజనీదేవి )

*

ఊగిపోతున్నదీ - సాగిపోతున్నదీ -
ఉయ్యాలగా నౌక - వయ్యారి నౌకా. ఊగి

ఈ గట్టుపై చేలు - ఆ తట్టునే పూలు -
మురిసిపోతూ తన్ను దరిసింప గరువాన. ఊగి

తరగతో పై కెగసి - నురుగులోనే సొగసి -
కొందమయేనుగు సొంపు లొందవ పూపొదవోలె. ఊగి

అరవిచ్చు కలువతో - సరివచ్చు చెలువుతో -
తీరమే లేని యే దూర దూరాలకో. ఊగి

*

అదిగో అదిగో నరలోకం !
అదియే సుందరతరలోకం !! అదిగో.

చీకటి చాయలతో –
వేకువ రేకలతో –
మిన్నులతోచిన మబ్బులతో –
పున్నమి పూచిన వెన్నెలతో అదిగో.

పైరుచేలతో పచ్చికతో –
ఏరులతోడ ఎడారులతో –
ఎత్తగు కొండల కోనలతో –
ఒత్తగు చక్కని కానలతో అదిగో.

రేగిన యెండల గాడ్పులతో –
సాగెడు చల్లని గాలులతో –
మృగాలతోడ భయంకరమై –
ఖగాలతోడ మనోహరమై అదిగో.

పూరియిళ్ళతో – సౌధపాళితో –
దారులతో – పెడదారులతో –
ఖేద మొందుచూ మోదమందుచూ
ఆదిదేవు పాదాలు చేరుచూ. అదిగో.

*

భోగిమంటలు వేయుడీ ! మీ రెల్ల
మూగుచీకటి త్రోయుడీ !! భోగి.

చెత్తలన్ని రగులు నింధనములై -
క్రొత్తవన్ని మిగులు సుందరములై. భోగి.

ద్వేషములు స్వార్థములు తూలునంటా -
రోషము లహంకృతులు వ్రాలునంటా. భోగి.

జగమంతలో శాంతి పండింపగా -
యుగయుగమ్ముల కాంతి నిండింపగా భోగి.

*

ప్రాకటమ్ముగా శరత్తు కాంతివంతమైనదీ !
లోకమంత ఏకమై ప్రశాంతి నందుకొన్నదీ !! ప్రాక.

జాతికోరకాలలో ప్రమోదముల్ చెలంగగా -
ప్రీతిగా చకోరకాల ఖేదముల్ తొలంగగా - ప్రాక.

వేణువీథిలోన శీతలానిలమ్ము రేగెనూ -
ప్రాణికోటి మానసమ్ములోన సౌఖ్యమూగెనూ - ప్రాక.

ఆశలందు శ్వేతమేఘమాల సంచరించెలే !
భాసురాశయాలతో ప్రజాళి సంతసించెలే !! ప్రాక.

*

ఓ సఖుడా ! ఆమని యిదిగో !
ఓ సఖియా ! నా మన సిదుగో ! ఓ.

ఆటలుగా బ్రతు కాడుదమా ?
పాటలు నెమ్మది పాడుదమా ? ఓ.

కొమ్మ లవే చివురించినవీ –
రెమ్మలు మొగ్గలు నించినవీ –
సాగెడు తీగలు మ్రాకులపై –
మూగెడు తేటులు పూవులపై ఓ.

ఈ చాయల చోద్యము కనవే ?
తోచిన వెన్నెల చేకొనవే !
కూసిన దా కోయిల వినవే !
పూసిన వీ మల్లెలు మనవే !! ఓ.

నాయెదపై నోవాక సరమై –
నామదిలో నీవాక వరమై –
చీకటి నీడలు నెట్టుదమా ?
నాకిట దివ్వెలు పెట్టుదమా ? ఓ.

*

దీపాలూ! దీపాలూ!
దీపావళికీ దీపాలూ!! దీపాలూ.

చీకటి వాకిట దీపాలూ!
ఆరని జారని దీపాలూ!! దీపాలూ.

యువమోహన జీవన భవనంలో –
నవనవ సుందరతర భువనంలో దీపాలూ.

పసిపాపలకూ బంగరుతీగలు –
ముసలివారికి మోదుగపూవులు –
ఎల్లవారలూ సంతసమ్ముతో
ఉల్లములందున పొంగుచుండగా దీపాలూ.

ఆశలకూ దివ్యాశయాలకూ
ఆశ్రయమైనవి ఉజ్జ్వలమైనవి –
చిత్రచిత్ర వర్ణాంచితములుగా
నేత్రపర్వమై భాస్వరములుగా దీపాలూ.

*

పదవే పదవే పద పోదాం!
అదిగో కనవే తల్లిపదం!! పద.

మల్లిక! మాలతి! పారిజాతమా!
ఫుల్లవకుళమా! నీరజాతమా!
మోసకారి తుమ్మెద మాటలనూ
లేశమునూ మది నమ్మెద వేటికి పద.

ఆకసమందున తారలతలపై
వేకువనంటుచు ఆలయ మదిగో -
ఆలయమ్ములో అమ్మవారటా -
అమ్మయడుగులే మావి యిపుళ్ళట పద.

కరుణారసమే తేనెసోనలై
కురిసే చల్లని చూపులు తల్లివి !
జీవితములు ఆ మాతృపూజలో
పావనములు కాగలవంటా పద.

*

దీపాలు వెలిగించుడీ ! వాకిళ్ళ
చీకట్లు తొలగించుడీ ! ! దీపాలు.

కాదారి దారి తారాతోరణాలుగా -
జీమూతవీథి శంపాజాల మాలగా దీపాలు.

వలపుతో నిండు గుండెల నంటు పుల్కలో -
కలికి సిగ్గులకన్నియల కంటి తళ్కులో దీపాలు.

ఒక నూతనాశతో శక్తితో శాంతితో -
సకలమానవ మానసోద్దీపకాంతితో. దీపాలు.

*

పూచితిమీ – విరబూచితిమీ !
చక్కదనమ్ముల చుక్కలమై పూచి.

అందెలు సందడి చేయు నడుగుతో
అందగత్తె లేతెంచి తన్నగా పూచి.

మిన్నుల వెన్నెల విరిసే తరిలో
కన్నెలు మాదరిజేరి నవ్వగా పూచి.

మందయాన మామీద నుమియగా –
సుందరి మమ్ముల కౌగిలింపగా పూచి.

ఒక్కతె మాదెస హాయిగ చూడగ –
ఒక్కతె మాకడ తీయగ పాడగ పూచి.

*

పడవ నడపవోయ్ ! పూలపడవ నడపవోయ్ !! పడవ.

చుట్టిన తెరచాప నెత్తి – గట్టిగ చుక్కాని పట్టి –
ఒరగనీక సురగనీక తరగలపై తేలిపోవ పడవ.

చక్కని రాయంచనంచు–చుక్కలతళుకెంచుకొంచు –
మన్నుమిన్ను కలుపుచున్న తెన్నులలో సాగిపోవ పడవ.

ఊరుదాటి యేరుదాటి – కడలి నాల్గుకడలు దాటి –
చీకుచింతలేని వింతలోకానికి చేరునంట. పడవ

*

ఏరునే సెలయేరునే! కూరిమిగ నీదారి గంటిని -
కోనలో జనియించి యీగతి కానలో జనుచుంటినీ   ఏరునే.

ఆదిలో చిన్నారియడుగై - అంతలో వయ్యారి నడకై -
మోదమున వేగమ్ముహెచ్చగ పోదు పచ్చికబాటలో  ఏరునే.

పూవులా సొగసైన పొదలూ తీవలూ యిరువంకలా నెరి
తావులా నెగబోయ నడవిత్రోవలా ప్రవహింతునూ.  ఏరునే.

రంగురంగుల చిన్నపిట్టలు చెంగుచెంగున దూకుదుప్పలు
కొండచిలువా పెద్దపులియూ నుండు నిద్దరి నద్దరీ   ఏరునే.

కల్లకపటా లేమెరుంగని భిల్లులూ నివసింతు రీ వని -
ఎల్లరకు నీరిచ్చి కొల్లగ చల్లగా బ్రతికింతునూ   ఏరునే.

*

ఈ వసంతోత్సవంలో - ఏ మంచి
భావాలు భాసించునో? ఈ.

మా జీవితాలు పూజాప్రసూనాలైన
రాజీవపత్రాలుగా మారునో! ఈ.

నరులమందరము సోదరులమై వరలగా
అరయగా ధరణియే సురలోక మగునో! ఈ.

కరువులే రాకుండునో - మా గుండె
బరువులే కాకుండునో! ఈ.

ఇలపైన చలిచీకటులు తొలగునో - క్రొత్త
వెలుగులో సిరిసంపదలు కలుగునో! ఈ.

*

ఊపరె వూపరె వుయ్యాలా !
చిన్నారి పొన్నారి వుయ్యాలా ! ! ఊపరె.

చుక్కలదాకా రెక్కలుసాచే
చక్కని బంగరు వుయ్యాలా !
మిన్నులపై పరువమ్ముల వెన్నెల
తెన్నుల తిరిగే వుయ్యాలా !! ఊపరె.

పచ్చనితీగల వుయ్యాలా !
విచ్చిన పూవుల వుయ్యాలా !
మువ్వలు మొరసే నవ్వులు మెరసే
వెలుగు జిలుగులా వుయ్యాలా !! ఊపరె.

కలకల్లాడే వుయ్యాలా !
తళతళ్లాడే వుయ్యాలా !
పాపం పుణ్యం యేమియెరుంగని
పాపాయూగే వుయ్యాలా !! ఊపరె.

*

విరిసినవి చేమంతులూ !
దరిసినది హేమంతమనగా విరిసి.

పూలతోటల చేలబాటల
మేలుకొనె అందాల చిన్నెలు విరిసి.

కన్నెమదిలో కదలు కోర్కుల
తెన్నులందు పసిండి వన్నెల విరిసి.

చెలియలా సిగలందు బంగరు
చెలువుతో వలపించు రంగుల విరిసి.

ముసలి మైదువరాల మోముల
మసలు మేలిమి పసపుచాయల విరిసి.

తల్లి చరణార్చనమునకు సం
ఫుల్లములు సౌగంధికములై విరిసి.

*

ఆమని తోటల మిసమిసలూ –
ఏమనెనో విను మా గుసగుసలూ. ఆమని.

పూవుల రేకుల వన్నె చిన్నెలూ
తావులు తేనెలు నా కొరకేనట. ఆమని.

కోయిల కూతల తేటిమ్రోతలా
తీయదనాలవి నా కొరకేనట –
పైరగాలి వయ్యారి నడకలూ
దోరవెన్నెలా నా కొరకేనట ఆమని.

చివురాకులపై రంగుల పొంగులు
నవకాలన్నియు నా కొరకేనట –
ఎదిగే పొదలూ సాగుతీగలూ
మది నుప్పొంగుట నా కొరకేనట. ఆమని.

*

గున్నమామి కొమ్మచూడ కన్నులకింపైనదీ !
లేజివుళ్ల యెఱ్ఱనతో రాజిలి సొంపైనదీ !! గున్న.

గున్నమావి కొమ్మమీద చిన్నకోయి లున్నదీ !
కోయిలా యెలుంగులోన హాయి పొంగుచున్నదీ !!
గున్నమావి కొమ్మమీద కన్నెపూలు పూసెనూ !
పూవుల పందిళ్లలోన తావులు విరబోసెనూ !! గున్న.

గున్నమావి కొమ్మమీద వెన్నెలలే కాసెనూ !
పండువెన్నెలందు పాట గండుతేటి మ్రోసెనూ !!
గున్నమావి కొమ్మమీద చిన్నపండు పుట్టెనూ !
జీవితాల తీయనైన భావములే పట్టునో !! గున్న.

*

# ప్రేమ గీతాలు

అరుగో వ్రేతల కన్నియలూ !
పరుగెత్తెదరా హరిసన్నిధికీ. అరుగో.

కురు లల్లాడగ హారము లాడగ
వర చేలాంచలములు అల్లాడగ అరుగో.

ఎన్నగ యశోద కన్నది బాలుని
కన్గొని వస్త్రము గా కని వేడుక అరుగో.

కమ్మని వెన్నయు పాలమీగడా
కానుకలుగ చేకొని వేగముగా అరుగో.

నీలమేఘ సందర్శనాత్త శం
పాలతికల పోలికలై అరుగో అరుగో.

*

జంటగా నావెంట నడుచువాడే ! సామి
ఒంటిగా నన్నింట విడిచినాడే !! జంట.

నాప్రాణమై ప్రాణమిచ్చువాడే ! నేడు
వంత నాకింతగా తెచ్చినాడే !! జంట.

ఆ నవ్వులో పువ్వులే పూచునే ! ఇప్పు
డీ వాడలో ప్రొద్దులే తోచనే !! జంట.

తెన్నులన్నీ వెన్నెలై వెల్గునే ! నేడు
నాకుచుట్టూ చీకటే మూగెనే !! జంట.

*

సక్కనైన మారాజా ! సుక్కలరాజా !
కన్నులెత్తి సూడు బలే యెన్నెలొచ్చినాదిలే !! సక్క.

సంకురాత్రి రొచ్చినాది సంతకి పోవాలీ –
సంతకెల్లి కోరినవీ సరుకులు తేవాలీ సక్క.

కోకలతో రైకలతో సోకులు సేయాలోయ్ !
కొత్తగాజు లేసుకుంటె కొత్తమోజులోయ్ !! సక్క.

పళ్ళూ పూలట్టుకోనీ గుళ్ళోకెళ్ళాలోయ్ !
పదిమందీ సల్లంగా బతకాలని మొక్కాలీ !! సక్క.

*

వినవే చెలి అదిగో ! వినవే పిలుపల్లదిగో !! వినవే.

పూలతావి మోయుచున్న గాలిపైన తేలివచ్చె –
తేనెసోనలైన వేణుగానములో తూలివచ్చె వినవే.

రాగ రంజితాత్మవై యేగుచుంటివా రాధా ? రాగ.

మలుపులేని దారివెంట – తలుపులేని ద్వారమంటి –
అంతులేని కాంతిలో ప్రశాంతితో సుఖింపగా రాగ.

పిలుపెంతో చేరువయ్యె – వలపంతా భారమయ్యె –
వేచియున్న నాస్వామిని చూచివత్తు నాప్రేమను వినవే.

ధన్యమయ్యె నేటికి నీ జన్మము నీప్రేమమూ –
ప్రేతలవంగడ మంతయు పూతమయ్యె నీకతాన రాగ.

*

ఇంత గాడ్పులో నడచి వచ్చినా
అంత దూరమా ఓ దేవా ! ఇంత.
ఎండు బ్రతుకు నీ గుండె నీడలో
పండనీయవా నా దేవా !! ఇంత.

ఇంత చీకులో వెదకి వచ్చినా
అంత దాగు టేలా స్వామీ !
ఒడలు వలపు నీ యడుగుజాడలో
విడిల నీయవా నా స్వామీ !! ఇంత.

ఇంత కోరి నీకొరకు వచ్చినా
అంతనిరసనా ఓ నాథా !
కొలుచు నన్ను నీ తలపు తోడుగా
నిలువనీయవా నా నాథా !! ఇంత.

*

చక్కని చుక్కేదిరా ? ఎక్కడ కనరాదురా ! చక్కని.
టక్కరి పడుచేదిరా ? పక్కన నవ్వేదిరా !
నవ్వులోన బొండుమల్లెపువ్వులు రువ్వేదిరా !! చక్కని.
టక్కరి పడుచేదిరా ? మక్కువ చూసేదిరా !
అరచూపుల దరిదాపుల మెరపులు దూసేదిరా !! చక్కని.
టక్కరి పడుచేదిరా ? తక్కుచు వచ్చేదిరా !
కులుకునడకతోనె కొత్తవలపులు విచ్చేదిరా !! చక్కని.
టక్కరి పడుచేదిరా ? సొక్కుచు పల్కేదిరా !
మాటలందు తీయనైన పాటలు చిల్కేదిరా !! చక్కని.

*

బ్రదుకంతా యిది నీ కోసం! నా
మెదలో మెదయే నీకోసం !! బ్రదు.

చిరుతనవ్వు నా చురుకుచూపు నీ
మేనిచాయలో మెరయు చివురులై బ్రదు.

తలపంతా నా వలపంతా నీ
యడుగుబాటలో విరియు పూవులై బ్రదు.

మాటలన్ని నా పాటలన్ని నీ
గుండెజాడలో నిండు తేనెలై బ్రదు.

ఆసలన్ని నా పూజలన్ని నీ
మోసల భాసిలు సఫలమ్ములుగా బ్రదు.

*

వచ్చెనోయ్ వసంతమూ!
విచ్చినది మల్లిలతాంతము !! వచ్చె.

కూసినది పుంస్కోకిలము మన
కోసమే – మనకోసమే!
కాసినది చంద్రాతపము మన
కోసమే – మన కోసమే !! వచ్చె.

నవరసాల కిసాలములలో
నవకములు మనకోసమే !
మలయమారుత వీచికలలో
చలువ లవి మన కోసమే !! వచ్చె.

పూవుతావులు తేటి పాటలు
కేవలము మనకోసమే!
జగతియంతయు చైత్రరథమై
సొగసుగనె మనకోసమే!! వచ్చె.

*

పాట పాడే చిన్నదానా!
మాట లాడవ వేం? ఒక
మాటు పలుకవ వేం? పాట.

మావికొమ్మల చివురుటాకుల
తావులం దుయ్యాల లూగుచు
గొంతునెత్తే కోయిల చెలీ!
ఇంత కోపమ వేం? నే
నంత పాపి న వేం? పాట.

సందెప్రొద్దులలో వెలుగుతో
అందగించిన పూలతోటల
ప్రోగుతూ కదిలేటి తేటీ!
మూగవోతి వ వేం? నా
రాగ మెరుగ వ వేం? పాట.

వెన్నెలా చీకటీ నడిరే
తెన్నులా తెరపింత లేకయె
జలజలా పరువెత్తు వాగా !
నిలిచి పలుకవటే ? నన్
దలచి కులుక వటే ? పాట.

*

ఎందుకో – వలపెందుకో ?
ఎందుకో – తలపెందుకో ? ఎందుకో.
నిలువునా నిలువునా చివురై
పులకరించే మావికొమ్మకు ఎందుకో.
ఎందుకో – వలపెందుకో ?
ఎందుకో – పిలుపెందుకో ?
వింతగా చివురాకు పొత్తిట
గొంతునెత్తే కోకిలమ్మకు ఎందుకో.
ఎందుకో – వలపెందుకో ?
ఎందుకో – పొలుపెందుకో ?
పరువమై బ్రతుకంత అలరై
మురువు చూపే మల్లెరెమ్మకు ఎందుకో.
ఎందుకో – వలపెందుకో ?
ఎందుకో – కులుకెందుకో ?
వన్నెలా చిన్నెలా పువ్వుల
తెన్నులా తిరిగేటి తేటికి ఎందుకో.

*

ఎవరవో? నీ వెవరవో?
చివురులా సోయగముదానా ఎవరవో.

ఎవ్వనికో నీయింత చక్కని
జవ్వనము కై సేయుచుంటివి ఎవరవో.

కాలిగజ్జెలు సందడింపగ
కేలిగాజులు మందలింపగ -
నడికిరే యొంటరిగ తొందర
నడక నేగుచు నింటిముందర ఎవరవో.

మెరయగా నీ మొయిలు కన్నులు
విరిసె నేదో హాయలు తెన్నుల-
నవ్వగా నీపెదవి మల్లెల
పువ్వులై విచ్చినది వెన్నెల ఎవరవో.

పలికితే - నీనోట రతనా
లొలికితే - మరియేమికావలె ?
పాటతో - నీగొంతు వీణలు
మీటితే - స్వర్గాలు రావలె ఎవరవో.

*

అందగాడా! నా చందురూడా!
చందురూడా! వెన్నెల్లరేడా!! అంద.

మల్లెపూవులకారు మళ్ళీరాదంటారు -
త్రోవాత్రోవా యేదో తాపినింపిరావో అంద.

గండూకోయిలగొంతు యెండూనింకంటారు –
తోటాతోటలయేదో పాటానింపీరావో అంద.

వినువీధిలోప్రొద్దూ కనుదాటే నంటారు-
నాల్గూదిక్కులయేదో వెల్గూనింపీరావో అంద.

తెలిమల్లేతావీ, కోయిలతీయనిపాటా, వె
న్నెల చక్కని వెల్గూ, నావలపూనింపా రావో అం.

*

ఏలా నవ్వేద వదియేలా ?
రాలె నిదిగో మల్లెలమాలా ఏలా.

నాచెలియా ! వలపూరు చూపులో
దాచితివా నెరితావి తీపులూ ఏలా.

నీమదిలోపల మాయని వెన్నెల
విరియించెదవో నాకొరకే !
నీయడుగంటిన చాయల వేకువ
మెరయించెదవో నావరకే ఏలా.

నడిరే సాగిన మింటిపాటలో-
గుడిలో మ్రోగిన గంట మ్రోతలో –
నీయెలుంగులే వినవచ్చినవీ –
నావెలుంగునై కనవచ్చితివీ ఏలా.

*

రావేలనే జాబిలీ? వెన్నెల్లు
తేవేలనే కోమలీ? రావే.

ఇరులలో మబ్బుదొంతరలలో వెల్గులే
కరువయ్యె - బ్రతుకంత బరువయ్యెనే రావే.

చిరునవ్వులో కంటి అరచూపులో కోటి
మెరపులే నన్నంటె విరితూపులై రావే.

పిలిచినా యెలుగెత్తి పలుకలేవా? ఇంత
వలచినా యెడదలో కులుకలేవా? రావే.

ఆటలేమియులేక పాటలే వినరాక
ఒంటిగా నే వేచియుంటి నీకోసమే -
కోపమా? నాకంటిదీపమా - నాసఖి!
చూడుమీ నావంక! తోడురమ్మా రావే.

*

ఎన్నడో యిక నెన్నడో?
మిన్నులా వెన్నెలా కాయుట ఎన్నడో?

వీడిపోయితి వొంటిగా నను -
చూడవైతివి నాదు వేదన -
కారుచీకటి దారిలో కా
దారిలో మరి కాదు పున్నమి ఎన్నడో?

పడుచువాగది సంద్రమునకై
నడచుచూ తెగపాడుచున్నది -
భ్రమానుకొరకై తీగజవ్వని
కానలో వెదుకాడు చున్నది ఎన్నడో.

నీకొరకు నీరాకవరకూ
చీకుబ్రతు కేలాగు సాగునో ?
వలపునిండిన తలపులన్నియు
నిలిపితిని కానుకలుగా ఎన్నడో.

*

నల్లనివాడా ? నేను గొల్లకన్నెనోయ్ ! !
పిల్లనగ్రోవూదుము నాయుల్లము రంజిల్లగా నల్లని.

నీతీయని పాటలకై రేతిరి నొంటిగవచ్చితి -
నామనసూ నాతనువూ నామనికే నీదిగదా నల్లని.

ఆకసాన మబ్బులనీ చీకటులే మూగెననీ
నేనెరుంగనైతినోయి - నీతలపే వెలుంగాయె నల్లని.

మెరపే నీదూతికయై వలపే నానెచ్చెలియై -
తోడితెచ్చె నీదరికీనాడు పండె నానోములు నల్లని.

*

చాలిక నీపరిహాసములూ !
చాలుచాలు నీదరహాసములూ !! చాలు.

నెమ్మది నీతలపది నాదేయని
నమ్మితి నీగతి మోసపోతినీ చాలు.

ఏటిదరిని పూదోట తెరువులో
గాటమైన చీకట్ల ముసుగులో
రేయిరేయి నే వేచియుంటినీ
తీయని కల లెన్నియొ కంటూ చాలు.

కొమ్మలందు పిట్టలు జంటలుగా
కూరుచుండె నా కోరిక లూరగ –
చందమామకై వేచిన చుక్కల
చందముగా నట నిల్చితి నొంటిగ చాలు.

వత్తువనీ చనవిత్తువనీ
చిత్త మాశతో వేగిరింపగా
తెన్నులు చూచితి నీకొరకే –
నన్నిటు వంచన చేయుదునా ? చాలు.

*

ఓ చెలీ ! నాగుండె దోచుకున్నావే !
ఏనాటికీ నీవు నాదానవే !! ఓ.

చుక్కల్ని చూశాను నిన్నుచూశానూ –
చుక్కనీ మించె నీ చూపులో తీపూ ఓ

పువ్వుల్ని చూశాను నిన్నుచూశానూ –
పువ్వునీ మించె నీమేనిపై సొగసూ ఓ.

వెన్నెల్ని చూశాను నిన్నుచూశానూ –
వెన్నెల్నిమించె నీ నవ్వులో తేటా ఓ.

కోయిల్ని చూశాను నిన్నుచూశానూ –
కోయిల్ని మించె నీ గొంతులో పాటా ఓ.

*

ముసురట్టిందోయ్! గాలి బుసకొట్టిందోయ్! బావా!! ముసురు.

చిన్నదాన – మనసారా నిన్నె కోరియున్నదాన ముసురు.

నల్లమబ్బు మెరిసిందీ వొళ్లు జల్లుమన్నదీ –
కొండమీద వురిమిందీ గుండె కొట్టుకొన్నదీ ముసురు.

వూరుదాటి పొంగే సెలయేరుదాటి వస్తేసరి –
పచ్చని చేమంతిపూలు మెచ్చిన విస్తానులే ముసురు.

చీకటనీ యెంచకు నావాకిట దీపంపెడతా –
దీపానికి ముందుగ నాచూపుల పందిరి కడతా ముసురు.

*

పొంగారి పాడవే బంగారు వీణా !
భోగాల కల్యాణ రాగాలు జాణవై  పొంగారి.
పొంచి నా సామి ఆలించునేమో సుమీ -
ఎంతగా హాయిగా గొంతునెత్తెదవో  పొంగారి.
ప్రేమగీతమ్ములో సామగానమ్ములో
పాలమున్నిటిపై తేలించు పాటగా  పొంగారి.
ఆశలూరించి సందేశాలు సారించి
పాపాలు పోగొట్టుమీ పాటతో  పొంగారి.

*

ఓయి తుమ్మెదా ! ఇంత మాయచేతువా ?
నమ్మినాము నిన్నెమది మమ్ము మోసగింతువా ?  ఓ.
అరవిచ్చిన తెలిమల్లియనోయ్ ! నన్ను
ముశిపించగ వలపిచ్చితినోయ్ !!
నాదరికే తెంచి యిట్టె దొదవ్వల కేగినావు  ఓ.
పరువమ్ముల నెరదామరనోయ్ ! నన్ను
ముశిపించగ మనసిచ్చితినోయ్ !!
నాపజ్జకువచ్చి యిట్టె యేపక్కకో పోయినావు  ఓ.
సరిలేని గులాబిపూవునోయ్ ! నన్ను
మురుపించగ బ్రతుకిచ్చితినోయ్ !!
నాచేరువనిల్చియిట్టె యేచాయకో దూకినావు  ఓ.

*

# బాలగీతాలు

శ్రీలు నిండునూ - భాగ్యాలు పండునూ - మా
బాలప్రపంచం సుఖాల తేలుచుండునూ శ్రీలు.

మా కొరకే పూయునంట పూలతీగలూ
మా కొరకే కాయునంట పళ్లమొక్కలూ శ్రీలు.

తలపుల తావులువిరియా-పలుకుల తేనెలుకురియా-
చిరకాలము జీవింతుము-నరకోటిని సేవింతుము శ్రీలు.

గుడిలోపలి దేవునీ - బడిలో గురుదేవునీ -
తల్లిని తండ్రిని పెద్దల నెల్లర పూజింతుమూ శ్రీలు.

*

చూడుమీా తెలివెన్నెలా !
ఆడుచున్నది మిన్నులా !! చూడు.

బొండుమల్లియ తెచ్చె వన్నెలు -
పండుపున్నమి విచ్చె కన్నులు చూడు.

శివుని తలపై నెక్కి జాబిలి
అవనియంతయు కలయజూడగ
చెదరినవి చీకటుల గుంపులు
చెదరిపోయిన వెచటికో చూడు

కప్పురమ్ము దుమారములు పై
గుప్పినట్టుల హాయినీగుచు –
జవ్వనులు వేలొక్కసారిగ
నవ్వినట్టుల తీయనగుచూ చూడు.

గుడుల మేడల పూరికొంపల
అడవులా సెలయేళ్ల కొండల
పల్లియల బస్తీల నెల్లెడ
వెల్లవేసిన దల్లదే చూడు.

*

హోళి పండుగోయ్ ! ప్రజాపాళి పండుగోయ్ !
మనకోసం వచ్చినదీ ! మనగుండెల విచ్చినదీ !! హోళి.

పూలపండుగా – కొత్తసాలుపండుగా – వసం
తాల పండుగా – సంతసాల పండుగోయ్ హోళి.

తోటలన్ని పూవులతో–బాటలన్ని తావులతో
మెరయుచున్నవోయ్! హాయ్ కురియుచున్నవోయ్!! హోళి.

మరువండీ కయ్యములూ ! అరయండీ నెయ్యములూ!
నష్టములూ రావు రావు కష్టము లేనాటికీ హోళి.

*

దసరాలూ వచ్చెనోయ్ ! సరదాలూ హెచ్చెనోయ్ !
అత్తవారియింటికీ కొత్తల్లునిరాకతో దసరా.

గిలకలుపట్టే పిల్లలు కులికే నవ్వులతో –
కన్నెల వాల్జడలందున చెన్నగు పువ్వులతో దసరా.

పేరుకొన్న మబ్బులన్ని దూరమ్ములకేగగా –
చల్లని చక్కని వెన్నెల యెల్లెడలా రేగగా దసరా.

చేలలోని వరిమొక్కలు చూలింతలవలె నున్నవి –
వాడలన్ని వినోదాలతోడ పొంగుచున్నవీ దసరా.

ప్రతిహృదయం ఆలయమై – ప్రతిభావం నీరజమై –
జగన్మాతపూజింపగ జనం సంభ్రమింపగా దసరా.

*

లాలీ లాలీ లల్లాలీ !
కన్నుమూయుమీా కానలోపలా లాలీ.

కలుగుల్లోపలి చిలువల్లారా !
ముండ్లపందులా మూకల్లారా !
నక్కల్లారా ! కుక్కల్లారా !
రా కండీ మా రాణీదరికీ !! లాలీ.

పికమా ! హాయిగపాడగదే –
శుకమా ! తీయగపల్కగదే –
కష్టములూ ! మరి – నష్టములూ !
రా కండీ మా రాణీదరికీ !! రాణీ.

చెత్తపురుగులూ ! వానపాములూ !
నత్తగుల్లలూ ! తొలగండీ !
ఎలుకల్లారా ! ఎలుగుల్లారా !
రాకండీ మా రాణీదరికీ !! రాణీ.

([illegible])

*

అన్నలం – తమ్ములం ! ఎన్నగ నరులందరం !
ఏకకుటుంబం మనదీ లోక మొకే మందిరం !! అన్న.

ద్వేషములూ స్వార్థములూ రోషములూ మానుడీ !
త్యాగములూ సహనాలనురాగములూ పూనుడీ !! అన్న.

చీకటిమబ్బుల తొలుచు వేకువ ఉదయించవే !
చల్లని వెన్నెలకాయుచు ఎల్లలంతరించవే !! అన్న.

ఘోరమైన హింసలైన పోరాటములెందుకో ?
అదిగో అదె శాంతిపథం – పదవోయ్ పద ముందుకు. అన్న.

*

అందముగా నవ్వినాడు - చందమామ చూడరే !
మొయిలు తెరలు చీల్చుకొంచు హాయలుమీరవచ్చినాడు!!
అంద.

ఇన్నినాళ్ళ చీకటులో తెన్నులలో ప్రాకులాడి -
పున్నమి వెన్నెల కాయుచు - కన్నులపండువు చేయుచు
అంద.

వేచియున్న చుక్కలు దోబూచులాడుచుండగా -
పసిపాపల గుండెలు సంతసము నొందుచుండగా అంద.

కల్వపూలు సరసిలోన కళ్ళువిప్పిచూచెనే !
అల్లవిగో కల్వలు జాబిల్లిగుండె నూచెనే !! అంద.

*

అచ్చమైన పండుగోయ్ ! వచ్చె కొత్తపండుగోయ్ !!
తెలుగువారి కందరికీ వెలుగుదారి చూపుటకై అచ్చ.

ముక్కోటీ దేవతలూ ముక్కోటీ ఆంధ్రులూ
చూడ నేడు ఒక్కటిగా కూడినారు ముచ్చటగా అచ్చ.

చీకటులూ జారిపోయె వేకువయే చేరవచ్చె
గౌతమి కృష్ణా పినాకినీ తరంగిణులు పొంగగ అచ్చ.

మన గోవులు మనభూములు దిన దినాభివృద్ధినంద
ఇరుగుపొరుగులందున మన పరువు పెంపు నొందగా అచ్చ.

*

గిరగిర చరచర బిరబిర తిరిగే
రంగుల రంగుల రాటమురా! గిర.

పచ్చని యెఱ్ఱని తెల్లని వన్నెలు
విచ్చియొక్కటే క్రొత్తవెలుగుతో. గిర.

ఆటలు పాటలు మాటలు కథలూ
నాటికలూ వినిపించు వెలుగుతో. గిర.

పిల్లలంద రుల్లాస మొందగా -
పెద్దవారి కామోదకరముగా. గిర.

*

కావాలోయ్ ! కావాలోయ్ !
బాణాసంచా కావాలోయ్ !! కావా.

చిక్కని రంగుల మతాబులూ !
చక్కని పొంగుల కాకరలూ !! కావా.

గిరగిర తిరిగే సిసిందిరీలూ -
చరచర యెగిరే తారాజువ్వలు -
చిటచిటమనేవి కప్పగంతులూ -
పటాపటాపట్ టపాకాయలూ - కావా.

అమాస చీకట్లను పోగొట్టే
విమలమైన కాంతులు వెదజల్లే
తెల్లని పచ్చని యెఱ్ఱని వన్నెల
దివ్వెలు వెలుగం దిచ్చేవీ కావా.

*

ఎఱ్ఱనివీ నేత్రమ్ములు ! ఎఱ్ఱనివీ గన్నేరులు !
అమ్మవారి కోమల పాదమ్ము లెఱ్ఱనైనవీ !! ఎఱ్ఱ.

దానిమ్మల పూవెఱ్ఱన ! మాణిక్యమ్ము లెఱ్ఱనా !
వీరకోటి కన్నులలో జీర లెఱ్ఱనైనవీ !! ఎఱ్ఱ.

శోణములూ కుంకుమ పారాణు లెఱ్ఱనైనవీ !
దీపమెఱ్ఱనైనదీ ! కోప మెఱ్ఱనైనదీ !! ఎఱ్ఱ.

సంధ్యాసమయమ్ములలో సూర్యబింబ మెఱ్ఱనా !
పసిపాపల బుగ్గలపై మిసిమి యెఱ్ఱనైనదీ !! ఎఱ్ఱ.

*

చందమామ ! చందమామ ! అందమైన చందమామ !!
పాలదారిలోన మల్లెపూల తేరుమీద వచ్చు చంద.

కొండమీద వెండిగిన్నె పండువెన్నె లిచ్చుచుండె –
పాలసంద్రమందు పుట్టి తేలిపోయి మిన్నుముట్టె చంద.

లచ్చికి తోబుట్టువంట – అచ్చముగా చల్లనంట –
హరుని శిరసుమీద జాజి విరిగా విరబారెనంట చంద.

రోజురోజు తరుగుచుండు – రోజురోజు పెరుగుచుండు –
పిల్లల చిత్తమ్ములు రంజిల్లజేయు రాజు తానె చంద.

*

కనరావో మన దేశమునూ!
వినవో ఘనసందేశమునూ!! కన.

సీతయె తల్లిగ రాముడు తండ్రిగ
ఖ్యాతిగన్నదీ భారతవర్షము కన.

వీరులు పుట్టిన దిచ్చటనే –
ధీరులు మెట్టిన దిచ్చటనే –
ఘనధర్మములూ వరశీలములూ
జనియించిన వీదేశమునా కన.

కవిగాయకులూ చిత్రకారులూ
పెనుపొందిరి మా భారతమందున –
యువరత్నలూ నవశిల్పములూ
వెలుగొందినవీ దిక్కులయందున కన.

చీకటి లేనిది మనదేశం!
ఆకలిరానిది మనదేశం!!
మిన్నుల వెలిగే మనహాసం –
వెన్నెల అదిగో మనకోసం కన.

*

వాన కురిసెనోయ్ – జల్లువాన కురిసెనోయ్!
మెరపులతో నురుములతో జడిజడిగా వడిగా వాన.

మన్నుమిన్ను లొక్కటిగా కారుమబ్బు మూగెనోయ్!
చిన్నిచిన్ని చినుకులతో హోరుగాలి రేగెనోయ్!! వాన.

ఏరులందు వాగులందు వరద వచ్చెనోయ్ !
దారులంట తెన్నులంట బురద హెచ్చెనోయ్ !! వాన.

పొలములందు వరిపైరులు మొలకలెత్తె ముచ్చటగా -
చిరుపచ్చిక తివాచీలు పరచుకొనియె దట్టముగా వాన.

దేవదేవు కరుణవోలె కోవెలపై కోటలపై
పేదలపై సాదులపై ఒక్కసారి ఒక్కరీతి వాన.

*

శ్రీల కన్నతల్లిరా ! వరాల కల్పవల్లిరా !
సాటిలేక ధరణిలోన మేటిభరతభూమిరా !! శ్రీ.

పాడిపంట తరుగులేక నాడు నేడు పెరుగునంట -
తెలివితేట తొలగబోక నలుదెసలా వెలుగునంట శ్రీ.

ఆర్యఋషుల ఆత్మబలం ఆదికవుల మనోబలం
ప్రజలందరి బాహుబలం నిజం మాతృదేశబలం శ్రీ.

ద్వేషములకు స్వార్థములకు రోషములకు తావులేదు -
త్యాగములకుశాంతము అనురాగములకుచావురాదు శ్రీ.

మనరాజ్యం మనకువచ్చె మనభాగ్యం మనకుహెచ్చు -
విశ్వమునకుభరతమాత శాశ్వతశ్రేయస్సు తెచ్చు శ్రీ.

*

తెల్లనివి మల్లెలూ ! తెల్లనివి మొల్లలూ !
దీనబంధువైన శివుని మేనిఛాయ తెల్లనా తెల్ల.

మంచిగంధముల పొడులూ మంచుజడులు తెల్లనివీ !
మంచివారి చూపులలో మించులవే తెల్లనివీ !! తెల్ల.

పాలు తెల్లనివీ ! కాగితాలు తెల్లనైనవీ !
పెరుగు తెల్లనిదీ ! సీటినురుగు తెల్లనైనదీ !! తెల్ల.

అందమైన పున్నమిరే చందమామ తెల్లనిదీ !
పసిపాపల నవ్వులలో మిసిమి తెల్లనైనదీ !! తెల్ల.

*

ఆటలాడుకొందమా ! పాట పాడుకొందమా !! ఆట.

తోటలందు చెట్లనీడ బాటలందు పేటలందు ఆట.

అందరమూ ఒక్కచోట అందముగా చేరినాము –
బడిముంగిలి గంటలాగె – గుడిలోపల గంటమ్రోగె ఆట

చీకు చింత లేని మనం బాలికలం బాలకులం –
ఆకసమున పిట్టలవలె పూలవన్నె చిన్నెలతో ఆట.

మనయాటలు దేశమునకు – మనపాటలు దైవమునకు –
పకపక నవ్వుచు గెంతుచు – ఒకరికోస మొకరమై ఆట.

*

నవ్వుతాం - నవ్వుతాం - పువ్వులమై గువ్వలమై నవ్వు.

లేబరువే కాదులే - ఏబరువూ లేదులే!
నొప్పించం ఎవ్వరినీ - మెప్పిస్తాం అందరినీ నవ్వు.

తరగలపై తేలియాడు నురుగులుగా తూలగా -
మిన్నులలో పేరుకొన్న వెన్నెలగా తేరగా నవ్వు.

చల్లగాలి దారులంట తెల్లని కొంగలమాదిరి
పక్కుమనీ గుక్కపట్టి ఉక్కిరిబిక్కిరిగా నవ్వు.

*

గొబ్బిపూజకు రారండీ!
గొబ్బి పూజలూ చేయండీ!! గొబ్బి.

ఆటల పాటల కన్నెయలారా!
పువ్వుల నవ్వుల జవ్వనులారా!! గొబ్బి.

పాడీ పంటా కావాలంటే -
కరువూ బరువూ పోవాలంటే గొబ్బి.

మెరిసే చక్కని చుక్కల్లారా!
విరిసే వొప్పుల కుప్పల్లారా!! గొబ్బి.

ఆడుద మందర మొకచోటా
పాడుద మందర మొకమాటే - గొబ్బి.

*

అది వింతపూల తోటా! ఓహో
పదవోయి మేలి బాటా!! అది.

విరులందు మించు వలపూ - మనలో
విరియించు మంచి తలపూ - అది.

అట లేవు తామసము వేదనలూ -
ఇటురావు సంగరము రోదనలూ - అది.

కుటిలాంధకార మిక రాదురాదు -
స్ఫుటమైన చంద్రికయు పోదుపోదు అది.

ఫలియించు సస్యములు నిత్యం!
కలిపించు భాగ్యములు సత్యం!! అది.

*

పిల్లలం బడి పిల్లలం !
కల్లకపటా మెరుగము ! ! పిల్ల.

కోడికూతకు మేలుకొని మా
తోడివారల మేలుకొలిపీ
కదలి అందర మొక్కబడిలో
చదువుకొందుము శ్రద్ధగా పిల్ల.

నొవ్వజేయని అల్లరులతో
నవ్వజేయుదు మెల్లవారిని -
దైవమును తలిదండ్రులను గురు
దేవులను పూజింతు మెప్పుడు పిల్ల.

ఎవ్వారిని బాధింపము !
ఎవ్వారిని దూషింపము !
జీవితము లాదర్శములుగా
భావి భారత పౌరులం పిల్ల.

*

# శ్రీ రా మ క థా గా న ం

శ్రీరామ రాఘవేంద్రా ! సీతామనోరాజి పూర్ణచంద్రా !
వైకుంఠదివ్యధామా ! సుశ్యామ ! లోకైక పూజ్యనామా ! !
క్షీరవారాశిలోనా - శేషాహి చారుతల్పంబుపైనా -
శయనించు దేవదేవా ! మా మీద దయనింపు మాధిగేవా ! !

క్రూరకృత్యములు సాగే - లోకాన దారుణాంధ్యములు మూగే -
పురుషార్థములు నేర్పగా - రావయ్య ! ధరణిభారము తీర్పగా...
దానవులు కష్టాత్ములై - ఓ స్వామి ! మానవులు దీనార్తులై -
తపియించుచున్నారయా - రారమ్మ ! కృపనించుమన్నారయా...

దశరథేశ్వరులతపనూ - కౌసల్య విశదవ్రతముల మహానూ -
ఫలియించినవి కాంతిలో - లోకాలు జ్వలియించినవి శాంతిలో
మౌనియాగము రక్షకై - క్రూరులౌ దానవావళి శిక్షకై -
ఆ రాఘవుం డరిగెనూ - అనుజుతో ఘోరాటవుల తిరిగెనూ...

దుష్టులను శిక్షించెనూ - మా తండ్రి శిష్టులను రక్షించెనూ -
మిథిలాపురము చేరగా - మా దాశరథియోగ నింపారగా...
విరిగె శంకరునివిల్లూ - స్వామిపై కురిసె వెన్నెల్లజల్లూ -
జానకీదరహాసమో - జనకభూజాని ఆత్మ వికాసమో...

శ్రీ జానకీయుతుడవై - వరమౌని రాజేంద్ర సన్నుతుడవై -
పరశురాముని శౌర్యమూ - రఘురామ! హరియించితివి సర్వమూ...
పూజ్యుడౌ తండ్రిమాటా - తలదాల్చి రాజ్యభోగముల మీటీ -
నారచీరలె కట్టితో - నా తండ్రి - కారడవులే పట్టితో...

దానవత్వము మించగా - రావణుడు జానకిని హరియించగా -
పుడమి చీకటిమూగెనూ - లంకపై వడగాడుపులు రేగెనూ...
జీవితమ్మె భారమై - జానకీదేవి దృష్టికి దూరమై -
ఎంతశోకించినాడో - శ్రీరాము డెంతకృశియించినాడో...

తరుల తీగల దరిసెనూ - మా తండ్రి గిరులకోనల నరసెనూ -
ఏవాడ కనరాదయా - మాతల్లి ఏజాడయును లేదయా...
ఆశ్రితుల రక్షింపుచూ - రాఘవులు - శాత్రవుల శిక్షింపుచూ -
వాలి కూలగ జేసిరీ - సుగ్రీవు వానరాధిపు జేసిరీ...

లంకాపురమె కాల్చెనో - దానవా హంకారమే వ్రేల్చెనో -
హనుమంతు డుద్రిక్తుడై - శ్రీరామ ఘనపాద సద్భక్తుడై...
వీర వానరకోటితో - సాహసోదార భాసుర ధాటితో -
జైత్రయాత్రకు వెళ్ళిరీ - రాఘవులు - శత్రువులె కంపిల్లిరీ

శరము సంధించినాడూ - వీరుడై శరధిబంధించినాడూ -
కోదండ పాణియగుచూ - దివ్యాస్త్ర వేదియై యోధుడగుచూ...
రావణాసుర భంజనా! రామయ్య! దేవసజ్జన రంజనా!
సీతాసమేత రామా! సూర్యవంశాబ్ధి సంజాత సోమా!!

శ్రీసతీ చిత్తకామా! బలభీమ! కోసలాధీశ రామా!
పట్టాభిరామ రామా! అయోధ్య పట్టణాధీశ రామా!!
శ్రీరామ రాఘవేంద్రా! సీతామనోరాజి పూర్ణ చంద్రా!
వైకుంఠ దివ్యధామా! సుశ్యామ! లోకైక పూజ్యనామా!!

*

*

# శ్రీ వింజమూరి శివరామరావు !

జననం : కీలక సంవత్సర వైశాఖపూర్ణిమ.

పిఠాపురం హైస్కూల్లో నాలుగు ఫారములూ, ఆ తరువాత బి. ఏ. అయ్యేవరకు కాకినాడ కాలేజీలోనూ విద్యాభ్యాసం.

పిఠాపురం కవిపండితసంఘం, మాతామహులు దేవులపల్లి సోదర కవీశ్వరులు. అష్టావధానాలూ శతావధానాలూ చేసి, అనేకాంధ్ర సంస్కృత కావ్యాలు వ్రాసి, మహాకవులై చిరకీర్తి నార్జించారు.

పినతల్లి లక్ష్మీనరసమ్మగారు; తండ్రి రామమూర్తిగారు. పురాణాలూ, ప్రబంధాలూ, కవితారీతులూ చెప్పి, ఆ తల్లిదండ్రులు శివరామరావుగారికి గురుపాదులైనారు. మేనమామయైన కృష్ణశాస్త్రిగారినుంచి కూర్పు, రచనలో కొత్తదారులు తీర్చుకున్నారు.

అమరుకం (పద్యానువాదం) - రజకలక్ష్మి, విజయపతాక, కళోపాసన (నాటికలు) - సుహాసాకథలూ, గోర్కీకథలూ ఇదివరలో వ్రాసి ప్రచురించారు. విశ్వామిత్ర మొదలైన నాటకాలూ, నగారా మొదలైన పద్యకావ్యాలూ, చాలా కథలూ, ఎన్నెన్నో గేయాలూ, ఆరువందలుపైగా రేడియోనాటికలూ రూపకాలు వ్రాశారు.

సాహిత్యసేవకు జీవితం అంకితం చేసిన శివరామరావుగారు 1949 నుంచి ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో స్క్రిప్ట్ రైటర్‌గా పనిచేస్తున్నారు.

*